భృగు- అంగిరసుఁడు- విశ్వామిత్రుఁడు- వశిష్ఠుఁడు- కశ్యపుఁడు- అత్రి- అగస్త్యుఁడు- ఈ యేడుగురు ఋషులను బట్టి కలిగిరి- జమదగ్ని- గౌతమ- భరద్వాజ- విశ్వామిత్ర- వశిష్ఠ- కాశ్యప- అత్రి- అగస్త్యులను- నీ యెనమండ్రు నిక్కముగా నందఱు బ్రాహ్మణులకు వంశకర్తలు- ఈ యెనిమిది గోత్రములనుండి పై వివరించిన నలువదితొమ్మిది గోత్రములును గలిగెను.

మొదట గర్భమునుండి జంతువు యొక్క- శిరస్సు పిదప బాహువులు తరువాతఁ దొడలు తుట్టతుదకుఁ బాదములు వెలువడుట తెలుసుకదా? కాఁబట్టి విరాట్పురుషుని శిరఃప్రదేశమగు ముఖము బ్రాహ్మణరూపమనియు బాహువులు క్షత్రియవర్ణమనియు నూరువులు వైశ్యజాతియనియు పాదములు శూద్రవర్ణమనియుం జెప్పఁబడెను. మొత్తముపై నీజగమంతయును విరాట్పురుషుని శరీరముగనుక నంతరిక్షము బ్రాహ్మణస్వరూపము నాయంతరిక్షము నడుమ నగపడు గ్రహములు నక్షత్రములు మేఘములు మెఱుపులు మొదలగునవి క్షత్రియరూపము- భూమి వైశ్యరూపము- పాతాళము శూద్రరూపము. భూగర్భములోని పదార్థములు తెలియఁబడవుగాన ద్విజసంస్కారములేక శూద్రజాతివలె నసంస్కృతమై యున్నది. భూమిపై భాగము గ్రహనక్షత్రగతులు నంతరిక్షము కొంతవఱకింద్రియగోచరము గనుక తత్తత్కార్యములయెడఁ బ్రవృత్తినివృత్తుల నుదహరించుటచేత నవి సంస్కృతములై బ్రహ్మక్షత్రియవైశ్యులవలె ద్విజత్వము గాంచిన ట్లూహింపఁబడు చున్నవి. వాస్తవముగా మొత్తముపై నాల్గుజాతులం బరఁగు ముఖబాహూరుపాదావయవ విశిష్టమగు మూర్తియంతకును దేహ మనియే పేరుగదా? కాఁబట్టి భూమియందు ద్విజులు ద్విజేతరులు ననిపించుకొన్న బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులందఱును మనుష్యులే- భృగ్వాదిసప్తర్షులు సప్తోర్ధ్వ

లోకములు- సప్తవాయువులు- సప్తకిరణాత్మకులు- సప్తాగ్నులు- సప్తసాగరములు- సప్తపాతాళములు నేడేళ్లుకలుపఁగా నలువది తొమ్మిదిగోత్రములుగాని కులములుగాని జాతులుగాని భిన్నవస్తు సమూహములుగాని తెలుచున్నవి- కాఁబట్టి యేద్రవ్యగుణకర్మ సామాన్యవిశేషసమవాయా భావములు సప్తపదార్థములని లెక్కింపఁ బడెను. ప్రకృతమున ముఖ్యముగాఁ బెండ్లి సఖ్యము సప్తపదులు ద్రొక్కుట సాప్తపదీనము సఖ్యము- మృతకళేబరమునకు సప్తకట్లు- సప్తదశాక్షరము యజ్ఞము- సభాసప్తాంగలక్షణము- అనాదిగా వేద ప్రమాణముచేత ప్రసిద్ధనియోగపూఃఖలు దుర్లభా యను పల్కు పాటించక వేదభాషకు యథేష్టార్థములు పన్ని గొప్పకొద్దులు తమలోఁదాము మనుష్యు లహంకారమమకారములతో స్వార్థపరులై మునులయభిప్రాయ మెఱుఁగ నేరక సర్వభూతదయయును సర్వలోకోప కారవర్తనమును యథాలాభసంతుష్టియును సకలవేదములు బోధించు చున్నవని సర్వజనసమ్మతముగా నొరులసుఖపెట్టి తాము సుఖపడ నేరక తెలిసీతెలియని జ్ఞానలవదుర్విదగ్ధులగు మనుష్యులు తనుగట్టు ప్రాళ్ళు తాఁదెచ్చుకొన్నట్లు కోరి తిర్యగ్జంతువులకన్నఁ గష్టములఁ బడుచుంటకుఁగారణము నిక్కముగా స్వాభిమానమే.

## తత్త్వనిర్ణయము

నానావిధ పాంచభౌతికోపాధుల నాశ్రయించి స్వకర్మఫల మనుభవించు వివిధజీవులు ననాదిగా నహంకారమమకారములతోఁ బ్రవర్తిల్లుట స్వభావము- దహనశక్తి యగ్నికి నిత్యమును సహజ మునుగాని యాయగ్నియొక్క జ్వాలాకారములు మఱి యది వెల్ల డించు నానావిధములగురంగులు నితరభూతసంయోగోపాధివిశేషజన్య ములు ననిత్యము లాగంతుకములుగాని సహజము లెట్లుకావో యటు

లనే పృథివ్యాది నవ ద్రవ్య పదార్థములను గుణకర్మ సామాన్యవిశేష సమవాయాభావములను నితరపదార్థవిశేషవ్యక్తీకరణ మనిత్యము నాగంతుకము గాని వాస్తవముగా స్వతస్సిద్ధము కాదు. పాంచభౌతిక స్థూలోపాధియుత్పత్తిస్థితినాశములందుటచేత ననిత్యమును స్వప్నము వలెఁ గల్పితమును మిథ్యయును గాని నిర్విషయమగు మనోద్రవ్యము వలె నిత్యమును సత్యమును గాదు- ఘటకపాలాదినామరూపము లుత్పత్తిస్థితినాశవంతములగుటచేత మృత్తునకు స్వప్నజగమువలెను మదనికారములవలెను గల్పితములుగాని వాస్తవము లెట్లుకావో యటులనే పంచభూతాత్మకస్థూలేంద్రియదృష్టములగు నహంకార మమకారప్రవ్యక్త శబ్దస్పర్శరూపరసగంధాదిగుణవిశేషములన్నియును మిథ్యలుగాని పరమార్థము లెంతమాత్రమును గావు- సత్వరజస్తమో గుణసామ్యమగు ప్రకృతియే యీసర్వజగద్వికారములకు మూలము. నిర్లిప్తుఁడు నసంగుఁడు నగు పరమపురుషుని సంపర్కమహిమముచేత సూదంటురాతిసంపర్కమున నినుము భ్రమించునట్లీప్రకృతి సర్వ జగద్వికారము లందుచుంట కాత్మవశమున జాగ్రత్స్వప్ననిద్రలం బరఁగు మనస్సె తార్కాణము.

పురుషసంపర్కమహిమముచేత నీత్రిగుణసామ్యమగు ప్రకృతి ప్రవృత్తి నివృత్తులందుచున్నదికాని నిర్గుణుఁడగు నప్పరమపురుషున కీప్రకృతిన్నార్చి తలంపేలేనికారణముచేతను త్రిగుణసామ్యమగు ప్రకృతి పురుషునివలె నిర్వికారమగుటచేతనుపురుషునకును మఱియుం బ్రకృతికిని స్వభావముగాలేనిజగద్వికారములన్నియును సున్నమునకుఁ గాని పసుపునకుఁగాని సహజముగాలేని యెఱుపా రెంటింటి సంపర్క విశేషమున నాగంతుకముగా నుద్భవస్థితినాశము లందుచున్నట్లు కనఁబట్టుచున్నవి. ప్రకృతికిఁ బురుషుఁడుగాని పురుషునకుఁ బ్రకృతిగాని యన్యోన్య మున్నట్లెంతమాత్రము దెలియదు. నిర్విషయమగు మన

స్నువలెఁ ద్రిగుణసామ్యమగు ప్రకృతియును దామరాకునంటని నీటి బిందువవలెఁ బ్రకృతినంటని పురుషుఁడు నన్యోన్యాభావవిశేషముచే నుభయు లెవరిమట్టుకువారే నిత్యులును సత్యులు నిర్వికారులును మఱియుం గేవలులును. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాదిజాతులు నానావిధదేహాద్యుపాధివిశేషములు నుత్పత్తిస్థితినాశవంతములగు సకల జగద్వికారములును స్వప్నవికారములవలె మిథ్యలుగాని వాస్తవ ములు కావు.

కలహమున కెందు కిట్లన్యాయముగా గ్రుద్దులాడెదరు? రెండును మట్టిబొమ్మలే. త్రొక్కుట త్రొక్కించుకొనుటయు నొక్కయవివేక మునఁ గలిగినచేష్టలే– వెనుకటిమొఱ్ఱ యెందుకు? వేదములు శాస్త్ర ములు గతించినవారిసంగతి నీకేల? ప్రస్తుతము నీయెదుటనున్న నీతోడిపాటివారి నెమ్మి సంపాదించుకొని వారినిసుఖపెట్టి నీవుసుఖ పడుము– నీవు బ్రాహ్మణుఁడవు కావు మఱి యబ్రాహ్మణుఁడవును గావు సుఖముగా బ్రతుకుటకై దేవులాడుజంతువులలో నొకజంతువవు. నీతోడిపాటిజంతువులకష్టములు కనిపెట్టి యొరులసుఖపెట్టి నీయూ పిరియున్నంతవఱకు నీవు సుఖపడుము. ఈ సంగతి యే వేదములు శాస్త్రములు మునులు పెద్దలు ప్రాచీనులు నవీను లాప్తులు పిన్న పెద్దలందఱును బోధించుసహజధర్మము. నీతల్లిదండ్రులు నీయవ్వ తాతలువలె నీ వున్నావా? వారిశరీరము వారిమనస్సులు వారిచేష్టలు వారికష్టసుఖములు వారిమతములు వారికర్మములువారిగతులు వేఱు. నీస్థితి వేఱు– కాలమునుబట్టి జగమునందలివస్తువులు ప్రతిక్షణ మొక్కొక్కవిధముగా వికారములందుచుండును. నీ బ్రతుకు సుఖ మెట్లు సమకూరునో యటులు నీతోడిపాటివారలతో నీవు వర్తించు నేర్పు నీలో నున్నది మఱి యట్టినేర్పు నీకొదవుట కాలరూపియైన దైవముచేతిలో నున్నది. హాయిగా బ్రతుకు– నీకోర్కె నీపౌరుషము

మఱి యాసుఖము నీకుఁ జేకూరుట నీయదృష్టమగు దైవము- నీ బ్రతుకు సుఖము కోరెదవేని "సర్వేజనాః సుఖినో భవన్తు" అని యహర్నిశమును జపించుచుండుము- వేదములు శాస్త్రములు పురాణములు ముసలమ్మపిట్టకథలు వెనుకటిముచ్చటలు గతజలసేతుబంధములు నీకేల? జగదుపకారముగా నడిచి యొరులసుఖపెట్టి తాసుఖపడువాఁడు గొప్పజాతివాఁడు. పరులను బాధించి తాబాధపడువాఁడు క్షుద్రజాతివాఁడు. దేశ మెవ రేలిన నేమి యెవరు ప్రభువు లైన నేమి వారివారి చిత్తానుసారముగా నడచి వారివారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడవై వారి కుపచరించి సుఖముగా బ్రతుకు మయ్యో! యవివేకీ! యీదేశ మీభూమి యీయిల్లీస్త్రీ యీధన మీదేహ మీయూపిరీ బ్రతుకు నీయధీన మనుకొనకు. నీ వెంతమాత్రమును స్వతంత్రుఁడవు కావు. కాలవశమున మఱియు నదృష్టవశమున నీకీబ్రతుకునందలిస్థితిగతులు తటస్థించుచున్నవి. వాస్తవము నీయహంకారమమకారములు నీచిత్తవికారములు నీస్థితిగతులు స్వప్నవికారములవలె మదవికారములమాడ్కి భ్రాంతిజన్యములుగాని వాస్తవములు కావు- నీ కీబోధ మవగాహమయ్యెనేని చూడు మాఁకలి కేయన్నమైనఁ దినకున్నావా? దప్పికే నీరైనఁ ద్రాగకున్నావా? కాఁబట్టి సుఖముగాఁ బ్రతుకఁ గోరితివేని నిన్ను నీవు ప్రేమించునట్లు నీతోడి పాటివారలం బ్రేమించి వారియౌన్నత్యసంపద నీకున్నట్లు మనస్సమాధానముచేసికొని యేయెండ కాగొడుగు పట్టి సుఖించుము- నాది భారతవర్షము. నేను బ్రాహ్మణుఁడను నాయిల్లు నావాకిలి నాధనము నాజాతి నాపెద్దలంతంతవారు వారలకువలె నాకు జరుగవలయును. జాతితక్కువవారికి నేను లోఁబడను నాకుఁగాని నాజాతివారికిఁగాని దేశవాసులకుఁగాని నన్నుండి యెట్టికష్టములు వచ్చినను రానీ జాతిపోఁగొట్టుకొనెదనా? వేదములు శాస్త్ర

ములు పురాణములు ప్రాచీనులు పెద్దలు బోధించిన నాజాతి నామర్యాద నాకులము పోఁగొట్టుకొందునా? యని తాఁబుచ్చిన గోత్రమందనంతను జెఱచిన ట్లేల నీవు చెడుటయేగాక నీతోడిపాటి వారిని జెఱచెదవు ? ఆఁడుజాతి పోఁతుజాతి యీరెండు జాతులుతప్ప మఱి జాతి లేదు- అన్యాయముగాఁ జెడిపోకు- మనుష్యులందఱి దొక్కటే జాతి- జాతిధర్మము కాపాడఁదలంచుకొందువేని నీతోడి మనుష్యులందఱితోఁ బొత్తుగొని వారియిష్టానుసారముగా నడుచుకొని సుఖించు- ఆయాకాలములకుఁ దగునట్లు వేదములు శాస్త్రములు పురాణములు మునివచనము లర్థముచేసికొని కాలోచితవర్తనము సమయోచితవాక్యముఁ బ్రకటించుచు సుఖముగా బ్రతుకుఁడనియే వేదశాస్త్రములన్నింటి తాత్పర్యము కాకతీఱదు- పుస్తెకట్టినమాత్ర మున వీనిపెండ్లా మగునా ? కవగూడినమాత్రమున వీనిసంతాన మగునా ? యేమీ నెత్తి ? బదరీబాదరాయణసంబంధ మీసంతసంసా రము చుట్టరికము. వాసివరుసలు కులములు జాతులును అనువస్తువు లకుఁబెట్టి నీబ్రతుకు. నీబ్రతుకుపెట్టె తాళముమాత్రము దైవముచేత నున్నదికాని నీచేతిలో లే నందుకు జాతి హెచ్చుతగ్గులెంచుకొని కులమునకై గ్రుద్దులాడెదవు. నీది మనుష్యజాతి నీవెంతపోఁగొట్టు కొన్నను మఱి యితరు లెంత జెఱచినను మనుష్యజాతికిఁ బశుజాతికి వలెఁ దోఁకలు వచ్చునా ? ఱెక్క లబ్బునా ? వెనుకటిపంచాగములు నీకేల ? నీతాత యెంతవాఁడైననేమి యెట్లున్ననేమి ? మునులసంగతి ప్రాచీనవర్ణవిశేషవిభేదము నీకేల ? అప్పటి కావేదములు మఱి యాకాలమున కాజాతిమర్యాదలు చెల్లినవి- "ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాట లాడి" అను న్యాయ మనుసరించి సుఖిం చుము- నీ కేజాతియును లేదు- నిక్కముగాఁ దక్కినజంతువులవలె నీ వొకజంతువవు- కాఁబట్టి దుష్టజంతువులను నేర్పునఁ దప్పుకొని

నిన్ను సుఖపెట్టుసాధుజంతువులఁ గనిపెట్టుకొని యుండు- ప్రస్తుతము వేదము శాస్త్రములకిద్దియే తాత్పర్యమని ముమ్మాటికి నమ్మకొనుము.

వేయేల త్రిగుణసామ్యమయిన ప్రకృతికే నిర్విషయిక మనస్సని రెండవ పేరు. సత్వరజస్తమోగుణత్రితయ ప్రకోపమువలన వాతపైత్యశ్లేష్మత్రిదోషసామ్య మారోగ్యము మఱి యారోగ్య లక్షణము కోర్కెలేమి. త్రిగుణసామ్యము ప్రకృతి. ప్రకృతిలక్షణము జగముతోఁజని ప్రళయాత్మకమగు సమాధ్యవస్థ- ఈజగమంతయును స్వప్నజగమువలె మనోభ్రాంతిమూలముగాని వాస్తవము కాదు. వాస్తవమైనచో నుత్పత్తిస్థితినాశవత్తుకనుక నే యనిత్యమును గార్యము నగునీజగ మాకారణము కానేరదుకదా ? కారణములేనికార్య మెట్లు కలుగును ? మఱియు జగత్సృష్టిస్థితిలయములకుఁ ద్రిగుణ సామ్యమగు ప్రకృతియొక్క గుణప్రకోపమే కారణమనకతీఱదు- మఱి యాగుణప్రకోపమునకు హేతువు ప్రకృతిపురుషసంపర్కమై యుండును- సూదంటురాయి సూదులసంపర్కముచే ననుమాన ప్రమాణమునఁ బ్రకృతిపురుషసంపర్కమును సాధించి సూచీపరి భ్రమణకార్యసదృశముగా జగత్కార్యమును సాధింపవచ్చును- ప్రకృతి పురుషపరస్పరసంపర్కవశమునఁ బ్రకృతిపురుషతత్వమెద్దియు న్గాని జగమనుమిథ్యాకార్యము విచిత్రమగునీడవలెఁ బొడముచున్న దనకతీఱదు- నిర్గుణుఁడగు పురుషునకుఁ బ్రతిబింబముపొడమనేరదు కదా ? త్రిగుణాత్మకమగు ప్రకృతిప్రతిబింబ మీజగత్తు. జాగ్రదవస్థా వస్తుప్రతిబింబము స్వప్నవస్తువైనట్లు కలుగుచున్నదని యనుమానించ వచ్చును. స్వప్నజగము నిక్కముగాఁ బుట్టలేదు. పెరుఁగలేదు మఱియు నశింపలేదుకదా ? పుట్టినట్లు నిలిచినట్లు నశించినట్లున్న నీడవంటి మిథ్యాస్వప్నభ్రాంతి సదృశకార్య మీజగము కానిచో

నిత్యవస్తువులగు ప్రకృతిపురుషు లీయనిత్యమిథ్యాజగత్కార్యమున కేవిధమైనకారణమున్గానేరరు. మఱియు నిజ్జగము త్రిగుణసామ్యమగు ప్రకృతియొక్క ప్రతిబింబముగాఁగాని నిర్గుణుఁడగు పురుషునిప్రతిబింబముగాఁగాని యుండనేరదు- ప్రకృతిపురుషసంపర్కభ్రాంతికారణముచే స్వప్నావస్థచే మిథ్యాప్రపంచముతోఁచునట్లీమిథ్యాజగము తోఁచుచున్నది- త్రిగుణసామ్యమగు ప్రకృతికి స్సంకల్పములేదు. నిర్గుణుఁడగు పురుషునకు న్సంకల్పమున్నదనరాదు. కాఁబట్టి ప్రకృతిపురుషసంపర్కజన్యమగు నెద్దియో యనిర్వచనీయపదార్థ మీజగత్కారణమని నిర్ణయింపకతీఱదు. సుషుప్త్యవస్థావిశేషము న్వివరించి చెప్పనలవికానిచందమున నీజగదుద్భవస్థితివినాశకారణము న్నిర్ణయింప నలవికాదు- తెలియశక్యముకాని కారణమే దైవము- మఱి యాదైవమే ప్రకృతి పురుషసంపర్క మహిమాత్మకమై యహంకారమమకారజనకమగు స్మృతిరూపమై యున్నది. మఱి యీస్మృతియే సకలసంసార హేతువు- సుషుప్త్యవస్థాత్మకమగు విస్మృతియే త్రిగుణసామ్యమగుప్రకృతి- స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థా సాక్షియై నిర్లిప్తుఁడై నిర్గుణుఁడయిన పరమాత్ముఁడు పురుషుఁడు. వేదములు పరమార్థమును జెప్పుచున్నవిగాని యొక్కింతయును లోకవ్యవహారమునుగూర్చి చెప్పవు. జగదుపకారపరులయిన యతీంద్రియద్రష్టలగు మునులు పామరబోధకొఱకు మఱి యుపాసనకొఱకు నలౌకికపదార్థములగు వేదములచే లౌకికపదార్థభినయ మొనర్చిరిగాని నిక్కముగా నిష్టుఁడనుకొన్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది లౌకికజాతుల న్గేవల పరమార్థబోధకములగు వేదము లెట్లు వాకొనును? అగ్ని తన్నుఁదా దహించుకొనఁజాలనట్లు ప్రజ్ఞానపురుషాత్మకమగు వేదము తనుఁదాఁ దెలిసికొనఁజాలదు. గుణాత్మకమగు తెలివి నిర్గుణుఁడగు వేదపురుషు నెట్లు తెలియఁగలదు? వాస్తవ

ముగా వేదపురుషుఁ డీలౌకికాకారాద్యక్షరమూర్తి యని చెప్పుట సాహసము. శాఖాగ్రచంద్రవత్తుగాఁ బామరబోధకై మునులు వేదముల నక్షరమయముగా నౌపచారికముగాఁ జెప్పి శ్రద్ధ నుద్బోధించుటకై "అగ్నిమీళే పురోహితమ్"అను మొదలగు వాఙ్మయము నుచ్చరించిరి. "పృషోదరా దీని యథోపదిష్టమ్" అను వ్యాకరణ సూత్రానుసారముగాఁ గేవలజగదుపకారకులయిన శిష్టులుచ్చరించిన వివిధవేదములు లౌకికములయినప్పటికిం బ్రమాణములుగా నంగీకరించుటయే మిక్కిలి శ్రేయము.

## వేదార్థము

వేదములయర్థమును వేదములభాషయును బ్రతియుగమున మాఱుచుండును. పురాణవచనానుసారముగా "ఇషేత్వోర్జేత్వా" అని ప్రారంభించు యజుర్వేదభాషయును మఱి తదర్థమును దదీయ కల్పవిధానములును బ్రతియుగమును మాఱుటచే వేదభాషయు న్దదర్థమును మఱియుఁదత్కల్పవిధానములు నైహలౌకికములేయనియు ననిత్యకార్యములనియుం జెప్పున్యాయవైశేషికాది పాషండమతములు సహేతుకములని యంగీకరింపకతీఱదు. మఱియును వేదములన్నియును వైఖరీరూపకమనుష్యకంఠోద్భవములు గనుక మానుషాదిదేహముల వలె ననిత్యములని నిర్ణయింపకతీఱదు. వేదములందు నమ్మకమధికముగాఁ బామరులకుఁ గలిగించి తరింపఁజేయుటకై కాశీవిశ్వనాథుని లింగమును గాశియును బ్రళయాంతమందుఁ గూడ నశింపక శాశ్వతములుగానుండునను వ్యాసవచనములవలెనే జైమినివ్యాసమహర్షులు వేదములు నిత్యములు మఱి యపౌరుషేయములని వేదములను స్తుతించుచుఁ దన్నిత్యత్వము నౌపచారికముగాను గౌణముగాను సిద్ధాంతీకరించి రని ప్రాజ్ఞు లెఱుఁగవలయును "యద్దృశ్యం తన్నశ్యమ్" అను

నట్లు మానుషేంద్రియములును మఱి తద్దృష్టపాంచభౌతికగుణ విశేషములన్నియు ననిత్యములును స్వప్నజగమువలె మిథ్యలనియును బ్రకటించు నుపనిషన్మతమే మిక్కిలి యుక్తియుక్తమునుఁ గడు సమంజసమును. స్త్రీ ముందా పురుషుఁడు ముందా? స్త్రీపురుష సంయోగము సంతానమునకుఁ గారణ మని చెప్పకతీఱదుగదా? స్త్రీపురుషమిథునమున కాదికారణము స్త్రీపురుషమిథునమే యని చెప్పినపు డనవస్థాచక్రకదోషము లనివార్యములు. చెట్టుముందా విత్తుముందా యనునపుడు చెట్టే విత్తు విత్తే చెట్టు. స్థూలసూక్ష్మాకారభేదమున్నప్పటికి వస్తుభేదము లేదనియును "వాచారంభణం వికారో నామధేయమ్" అను శ్రుతిప్రకారము మృద్ఘటముల కభేదము "మృదేవసత్యమ్" అనునట్లు నామరూపములు స్వప్నవస్తువులవలె మిథ్యలుం భ్రాంతిభాసికములని యంగీకరించినయెడల నిజ్జగమంతయును వ్యావహారికసత్యముగాని నిక్కముగాఁ బారమార్థికసత్యము కాదని నిశ్చయింపకతీఱదు.

## స్మృత్యర్థము

స్మృతియే యహంకారమమకారాత్మకమై సకలజంగమస్థావరాత్మక జగత్సృష్టిస్థితిలయములకుఁ గారణ మగుచున్నది. విస్మృతి దశయెడల నీసకలజగమును లయమగుచున్నది. కాఁబట్టి సగుణమగు స్మృతియే ప్రకృతి ప్రధానమాయావిద్యా నిర్వచనీయనామమని మఱి విస్మృతియే సమాధిప్రళయబ్రహ్మతురీయసచ్చిదానందలక్షణ కైవల్య మని సిద్ధాంతీకరింపకతీఱదు. "తెనుఁగెఱుఁగని సంస్కృతంబు తెన్నెఱుఁగున్" అనున ట్లైహలౌకికధర్మమునే తిన్నగాఁ దెలిసికొని నడువశక్తులుకాని మనుష్యులకుఁ బారలౌకికప్రతిబోధనైక ప్రయోజనములగు వేదచింతలు పీనుఁగుపెడబరు వెత్తఁజాలక గిజగిజ గింజుకొనువాఁడు హిమవత్పర్వత మెత్తనుంకించిన ట్లుండును. అతిం

ద్రియద్రిష్టలుం గారుణికు లగుపెద్దలు జగదుపకారధర్మకార్యము లందుఁ బామరులకు విశ్వాసము బలపర్చుటకై పరలోకమున్గల్పించి శాశ్వతస్వర్గసౌఖ్యము కలుగునని యాసపెట్టి బెల్లమగపర్చి చేదు మేపి పిల్లలం బాగుచేయుతల్లివలె స్వార్థపరతమాని "శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్- అహింసా పరమోధర్మః- పరోపకారార్థ మిదం శరీరమ్" అని చేదువలె నారోగ్యకరమును కష్టానుభవకరమగు పరోపకారధర్మమును వేదవేదాంగములంబన్ని నాట్యముచేఁ బామరులధనమును హరించునట్లు పామరులస్వలాభసౌఖ్యధనమును హరించి "యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరామ్యహమ్" అను న్యాయముగా సంసారభోగసౌఖ్యమును బోలంగించి జగదుపకారక ధర్మాచరణక్లేశమునఁ బ్రివర్తింపఁజేసిరి. బ్రితుకునకు సంతుష్ట మానసమే ఫలముగనుకను స్వాలాభనివృత్తియెడఁ గోర్కెతీఱక వెల్తిమనస్సున కధికమగుచుండుటచేతను పరోపకారప్రివర్తనము చేత స్వసౌఖ్యవిముఖతకలుగుకారణముచేత సంతృప్తమయిన మనస్సు నిర్విషయమగుటచే మనుష్యుఁడు సంసారదుఃఖ విముక్తుఁడగునని మునులు కేవలజగదుపకారకధర్మమును ముఖ్యగౌణవిధులచే వేద శాస్త్రకావ్యరచనాదిశేషములచే లౌకికవ్యవహారధర్మముల ననాది కాలమునుండియును బోధింపఁదలకొనిరి.

## అహం మమ ప్రత్యయము

అహంకార మమకార జాత్యభిమాన స్వపరవిభేద జన్యరాగ ద్వేషములచే నన్యోన్యముఁ దన్నుకొని వీరస్వర్గలాభ మనియును ధర్మ మనియును యుద్ధములాడి తెలిసీతెలియని జ్ఞానలవదుర్విదగ్ధులు "క్షణమప్యవతిష్ఠతే శ్వసన్ యది జంతుర్ననులాభవానసౌ" బ్రతికి యుండిన సుఖములు పడయవచ్చు ననునీతి నవలఁద్రోసి తిని త్రావి

యొరులఁ జంపి తాము జావనేల "శతం దీర్ఘమాయుః" అను శ్రుతిం బాటింపక వశ్యకర్తవ్యములగు సామదానము లవలఁద్రోసి స్వపరహానికరములగు భేదదండోపాయము లనుసరించుక్రూరులు బ్రతుకుతెరు వెఱుఁగని వెఱ్ఱులుకారే? దేహముమొదలుకొని యేవస్తువును నిక్కముగాఁ దనదికా దని ప్రతిక్షణానుభవమునఁ దెలిసికొనుచుండియు నాయాలు నాబిడ్డలు నాయిల్లు నాశరీరము నాధనము నాభూమి నాదేశము- నాజాతి- నానీతి యని మరభిమానము నహంకారమమకారమూలమగు సంసారమందు మమత విడఁజాలక కేవల పరోపకారమునకే తనబ్రతుకు ప్రయోజన మని పల్కు వేదశాస్త్ర పురాణర్షి వాక్యతాత్పర్యము గణింప కూర కొరుల హింసించి తాము హింసపడుచు బ్రాహ్మణులమనియు క్షత్రియులమనియుం బ్రభువుల మనియుం బరిపాలకులమనియు దేశజాత్యభిమానములతో నహంకార మమకారముచే నొండొరుం బొడుచుకొని చచ్చువారు మానుషాకారములనున్న రాక్షసులుం బశువులుగాని నిక్కముగా సకలప్రాణ్యుపకారైకధర్మస్వభావలక్షణులగు మానవు లెట్లాదురు? పెక్కుమాట లేల మనుష్యులందఱు నొకరినొకరునొప్పించక హింసించక సుఖముగా బ్రతుకుమార్గమంతయును సకలవేదశాస్త్రసమ్మతమే. రాచఱికము- జాతి- జాతినీతులు- వివాహవిధానములును- సంఘశాసనములు- పరిపాలనపద్ధతులు- లోకములోని మనుజు లొండొరులను బాధించక న్యోన్యానురాగమున నందఱును బ్రతుకుటకై దారు లేర్పఱచిన మునియభిప్రాయము సర్వలోకరక్షణముకదా? నేను నాది యనునహంకారమమకారములఁ దొఱఁగి మనుష్యులందఱు గలసిమెలసి సమాన నిద్రాహారవిహారసౌఖ్యములతో బ్రతుకుటయే సమస్తవేదశాస్త్రములు ఘంటాపథముగాఁ బోధించుచున్నవి. ఆఁడు దేముందుపుట్టెనో మగవాఁడే ముందు పుట్టెనో లే కుభయు లొక్కసారియే పుట్టిరో "ఇచ్ఛామాత్రం

ప్రభోః సృష్టిః” అనునట్లు దైవసంకల్ప మాత్రముచేతనే కొందఱు వృద్ధులు కొందఱుపడుచువారు కొందఱుపసివారు మొదలుగా నానా వర్ణములతో నానాదేశములందు నానాచారవ్యవహారములతో నానా జాతివయోరూపముల సమాన సంఖ్యాకులగు మానవులు కలి గిరో స్వర్గమర్త్యపాతాళములు తత్తద్వస్తువులతో నానా వస తులతోడి జడచైతన్యాత్మకజంగమస్థావరవస్తువు లెప్పటినుండి మొదలుకొని యెట్లిప్పటివఱకు మాఱుచున్నవో యింక ముం దీసృష్టి యేమగునో నానావేదశాస్త్రమతానుసారము నానాప్రకారములుగా నూహింపఁబడుచున్నవిగా? నానార్షిమతము లన్యోన్యయుక్తి ఖండితములౌటచేతను వేదశాస్త్రములు బహుముఖ ములై బహుమతములం బోధించుచుంటచేతను నిశ్చయము నిదమిద్ధ మ్మని నిర్ణయించుట కేప్రమాణము న్నిల్వకుంటచేతను మఱి యీలోకమందలి పదార్థతత్త్వమెద్దియైన నిది యిట్లని వాస్తవముగా నెఱుఁగ వీలుపడకుంటచేతను ప్రతిక్షణము వృద్ధిక్షీణతల మాఱు చున్న క్షణికేంద్రియములచేత క్షణికములగు ప్రత్యక్షవస్తుతత్త్వమును నిర్ణయించుటలో ననాదిచరిత్రానుసారముగా నిప్పటివఱకు న్సంశ యమే మిగిలియుంటచేతను “పదార్థతత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసావాప్తిః” యను న్యాయము పెండ్లియయినఁగాని వెఱ్ఱికుదురదు వెఱ్ఱికుదిరినఁ గాని పెండ్లికాదన్నట్లున్నది— కాఁబట్టి స్వర్గనరకములజోలి మనకేల? మన కవశములగు పాంచభౌతికకార్యచింత మనకేల? మనయిష్టాను సారము సూర్యుఁ డుదయించునా? ఋతువులు మాఱునా? కాఁబట్టి “అశ్వప్లుతం వాసవగర్జితంచ స్త్రీణాంచ చిత్తం పురుషస్య భాగ్యమ్ అవర్షణం చాప్యతి వర్షణంచ దేవో నజానాతి కుతో మనుష్యః” అనుటచేతఁ బదార్థతత్త్వ మెఱిఁగినామనుకొనుట కుందేటికొమ్ము చూచినామనుకొనుటకదా? నిద్రాహారవిహారసౌఖ్యమాసించు నీబ్రతు

కునఁ గొంతవఱకుఁ దోడిపాటిజనుల యనుగ్రహము సంపాదించు కొన్నప్పుడు లభించుచుంట ప్రత్యక్షధర్మార్థకామమోక్షముల నాల్గింటికిఁ బాదు ధర్మము కనుకనే చాతుర్వర్గమునకు ధర్మమే మొదటఁ జెప్పఁబడెను.

ధర్మ మనఁగా లోకోపకారకమగు వర్తనము. లోకోపకారక చింతగలవాని కిల్లు పిల్లాలు మొదలగు నర్థసుఖము కలుగును. ధర్మముగా సంపాదింపఁబడిన యర్థమున నాహారసౌఖ్యము నాయాహార సౌఖ్యముంబట్టి లోకసమ్మతవిహారరూపమగు కామసౌఖ్యమును మఱియట్టి జనరంజకవిహారమున నొదవు సుఖనిద్రావిశ్రాంతిరూపకమగు మోక్షానందమును లభించును. అభిలషితాహారవిహారనిద్రాత్మకములగు నర్థకామమోక్షముల కాలవాలము సర్వలోకోపకారకచింతాస్వరూపమగు ధర్మమేకదా? కాఁబట్టి నేను నాది యను జ్ఞప్తియున్నంతవఱకు దేహధారి సంసరించకతీఱదుగనుక గగనారవిందసదృశమగు పరలోకప్రసంగముతో కాలము లేనిపోని యజ్ఞములు యాగములు క్రతువులు మడి–తడులు స్నాన–సంధ్యలు జప–తపములు జాతి–భేదములు శ్రౌత–స్మార్తకర్మములు మిట్టవేదాంతములు సన్న్యాసములు ఘోరవ్రతములు వివాహపద్ధతులు స్వపరమతభేదములు మఠములు పీఠములు పూజలు సమాధులు భజనమందిరములు దైవప్రార్థనము లాకాశపంచాగములు సకలభూతవశ్యమంత్రాభిచారహోమములు వామాచారములు భూతభావిజన్మచింతలతో వృథా కాలయాపనముచేయక తమతోడిపాటిజనులను సుఖపెట్టి తాను సుఖపడు బ్రతుకుతెరువున నడుచువారే మనుష్యు లనఁదగినవారు. నాయాలు నాపిల్ల నాయిల్లు నాభూమి నాధనము నాసొత్తు ననునవి యహంకారమమకారకల్పితములై మద్యవికారజన్యములగు బొమ్మలవలె మిథ్యలుగాని వాస్తవములు కావు. అహంకారమమకారములను

దగ్గించుకొన్న పరోపకారపారీణులగు ధర్మాత్ములకు మాత్రము లోక సమ్మతముగా లభించిన నిద్రాహారవిహారాత్మకములగు నర్థకామ మోక్షములతో హాయియగు బ్రతుకు లభించును.

## మానవోన్నతి

ఎవ్వరికైనను బ్రతికియున్నవఱకు నిద్రాహారవిహారసౌఖ్య చింత తప్పునుకదా? తాను శూరుఁడని- పండితుఁడని- గొప్పకుల మునఁ బుట్టితినని యితరులకన్న నెక్కువగాఁ నెవ్వఁడైన నధికముగా భోగింప నర్హుఁడు కాఁడు- దేహధారులకుఁ గావలసిన తత్తద్దేశోచిత నిద్రాహారవిహారసౌఖ్యము దైవదత్తమైయున్నది. మనుష్యులలో నొకఁడొకనికంటె గొప్పయుం గాఁడు కొద్దియుం గాఁడు జ్ఞానియుం గాఁడు- మఱి యజ్ఞానియుం గాఁడు శుద్ధుఁడు న్గాఁ డశుద్ధుఁడు న్గాఁడు పుట్టినవారందఱు నూపిరితీసికొనుటకు నిద్రాహారవిహారసౌఖ్యమనుభ వించుటకు న్సమానస్వాతంత్ర్యముకలవారే యొకనికంటె నొకఁడు శిష్టుం గాఁడు భ్రష్టు న్గాఁడు ధనికుఁడు న్గాఁడు దరిద్రుఁడు న్గాఁడు. లోకోపకారకధర్మపరాయణుఁడు యథాలాభసంతుష్టుఁడు గాన సకలజనులను దనవలెఁ బ్రేమించును "అస్తి-భాతి-ప్రియ సచ్చిదా నందలక్షణం బ్రహ్మ"యనుటచే జగదుపకారపరాయణుఁడై నిత్య సంతుష్టుఁడైనధర్మాత్ముఁడు బాహ్యాంతశ్శత్రుబాధ నంటక మరణ చింతలేక నిర్భయుఁడై "అమృతమభయమాత్మ" అనునట్టు లహం కారమమకారసూన్యుఁ డౌటచే "అశరీరమాత్మా" యనునట్లు జగదుపకారధర్మస్వరూపుఁడై జీవన్ముక్తుఁడై శాశ్వతబ్రహ్మానందమం దును. ఊపిరితీసికొనుట నిద్రాహారవిహారసుఖాభిలాషము నల్లవారుకానీ తెల్లవారుకానీ యేవర్ణమువారుకానీ యేజాతివారుకానీ యేదేశము వారుకానీ పిన్నకానీ పెద్దకానీ సుఖజీవేచ్ఛ మనుష్యులందఱికిని

సమానమేకదా? దండకారణ్యమునఁ దపోధనులగు మునులు తమ్మ్రా రాక్షసులు భక్షింపఁగా భయపడరేమి ప్రతిఘటించరేమి ? ఆఁకట న్వేగుబెబ్బులికిఁ గోరి బుద్ధుఁ డేల తనయొడలినాహారముగానొసంగెను? దేవతల కేల దధీచిముని తనయెముకలను సమర్పించెను? శిబిచక్రవర్తి యేల తనయొడలిమాంసమునడేగ యాఁకలి తీర్చిగువ్వను గాపాడెను? ''పరోపకారార్థమిదంశరీరమ్'',''అహింసాపరమోధర్మః''అని తెలిసిన జగదుపకారకధర్మమూర్తులు కాఁబట్టి యట్లు పరులకై తమప్రాణము లొసంగిరి. శరీరస్మృతియున్నంతవఱకు మనుష్యుఁడుపరోపకారముగాఁ బ్రవర్తింపక త్రికరణశుద్ధిగాఁ దనతోడిపాటివారల కుపచరించక నిద్రాహారవిహారసౌఖ్యదాయకద్రవ్యముల నందఱితో సమానముగా వంతు పంచుకొనక దంభుఁడై యితరులకన్నఁదన కెద్దియో యాధిక్య మున్నదనుకొని విఱ్ఱవీఁగుచు ధర్మయుద్ధమని న్యాయదండనమని యును బరుల నేమిషచేతనైన బాధించిచంపుట రాక్షసకృత్యము పశుకర్మమునుగాని మనుష్యధర్మ మెంతమాత్రము న్గానేరదు- కుల గోత్రములు పూర్వాచారములు జాతినీతులు శ్రౌతస్మార్తవిహితపద్ధ తులు వేదశాస్త్రపురాణేతిహాసచోదితములని వంచకులు స్వార్థపరు లును మునులయభిప్రాయ మరయక వేదశాస్త్రపురాణేతిహాసకావ్య ముల కపార్థములు ప్రచురించి రాక్షసకృత్యములగు భేదదండోపాయ ములనుమాత్రమే యవలంబించి కేవలమనుష్యధర్మములగు సామ దానముల నుపేక్షింపరాదు. ఆహారనిద్రావిహారములాసించి బ్రతుకు పశుపక్షికీటములవలె మనుష్యులుఁగూడ నొకవిధమైన జంతుసమూ హములోఁ జేరినప్రాణులే కదా?

బ్రహ్మసృష్టిలో మనుష్యుఁ డెందు కుత్తముఁ డనవలెను? ఏజంతువులనైన హింసింపక ధాన్యములు కూరగాయలు పాలు మొద లగు సాత్వికాహారము చేమాత్రముబ్రతుకఁగలిగి జననమరణప్రవాహ

రూపకమగు సంసారతాపత్రయమునుండి తప్పించుకొను మోక్షోపాయము నెఱుఁగు తెల్వితేటలు సహజముగాఁ గలిగియుండుటచేతఁ గదా? లోకమందలి మనుష్యులు స్త్రీ బాలవృద్ధులందఱును బరస్పరానురాగముతో శక్తికొలఁదిఁ దమ తెల్వితేటల నుపయోగపర్చి కష్టపడి భూమిని ఫలవంతముగా ముజ్వేళలను సేద్యముచేసికొని కేవల శాకాహారులై తత్తద్దేశఫలితములగు ధాన్యముల నారగాయ పండులను బంచుకొని దేశకాలపాత్రోచితపథ్యాశనపానంబుల నంతుష్టులై యథేష్ట కేళీవిహారశయనసౌఖ్యంబులం బ్రతుకవలయుననియే వేదశాస్త్ర పురాణేతిహాసకావ్యముల యన్నింటి ముఖ్యాభిప్రాయ మని సిద్ధాంతీకరింపకతీఱదు- పరోపకారబుద్ధి యొక్కటి దప్ప తక్కినజాతిపద్ధతులు- గోత్రములు- వివాహపద్ధతులు ధనికదరిద్రతారతమ్యములు- స్వర్గనరకమతవిభేదములు శ్రౌతస్మార్త కర్మవిధానములు స్వీయపరకీయద్రవ్యకల్పనములు- వావివరుసలు కులవృద్ధసంప్రదాయములుపుత్రపౌత్రవంశపారంపర్యానుసారంగతస్వాస్థ్యవైభవానుభవన్యాయములు మొదలగునాచారములన్నియును స్వార్థపరతచే ధూర్తమానుషాకారముల నున్నరాక్షసులు పన్నినపన్నుఁగడగాని సహజసర్వభూతదయామయులగు మానవధర్మము లెంత మాత్రము గానేరవు. తాముచెడి యొరులనుజెఱచుదుర్మార్గులు మనుష్యాకారములనున్న రాక్షసులుకారా?సర్వేజనాః సుఖినోభవన్తు''అని యహర్నిశముం జింతించుటకన్న మనుష్యధర్మము వేఱొద్దియు గాదు.

## దర్శనపరామర్శ

ఎవఁడో పండితుఁడు నాయెదుటపడి నేఁ జెప్పినది కాదని సహేతుకముగా శాస్త్రార్థముచేసి వాదము నెగ్గఁగలఁడా? కానీ- ఇది నాకు నల్లగా నగపడుచున్నది యథార్థముగానే చెప్పుచున్నాను.

వితండముకాదు నల్పుకాదు తెల్పని నాకెట్లు బోధించెదవు? మఱియు నన్నెట్లొప్పించెదవు? నాదృష్టి వేఱు మఱియు నీదృష్టి వేఱు మఱి మనయుభయులమతమునకు "తత్తుసమన్వయాత్" సమన్వయ మెట్లు కుదురును? మన ముభయుల మొక్కఁడైనపుడుకదా యొక్క తెల్పో లేకొక్క నల్పో తెల్లమగును? మనోవాక్కాయకర్మల నీకు నాకును నల్పుతెల్పులకువలె భేదము కలదుకదా? నీసత్యము నాకబద్ధము నీతెల్పు నాకు నల్పు నీవు నీవు నేను నేను నీకును నాకును సామాన్యాధికరణ మొందైన న్నంభవించినపుడుగదా నీ యూహ నాయూహతో సమన్వయించును. నీవు లేనే లేవు- నా స్మృతికొలఁదిన్గదా నీసంగతి నాకగపడును? నా వయోవిశేషములఁ బట్టి నాస్మృతియొక్క వ్యక్తావ్యక్తదశ లుండును- కాఁబట్టి నాస్మృతి శక్తివిశేషమే నీవుగాని నిక్కముగా నీవనేపదార్థమే లేదు. ఇంతేకాక స్మృతియొక్క యవస్థావిశేషముచేతనే నేనున్నాను. నాస్మృతి సుషుప్తియందువలెఁ బ్రకృతియై త్రిగుణసామ్యమును బొందునపుడు నీవును లేవు నేనును లేను- మన ముభయుల మున్నామా లేమా కల గాంచుచున్నామా? యిద్ది జాగ్రదవస్థయని యెట్లు నిశ్చయింపఁ గల మిట్లనినా పూర్వపక్షమో నాయాయికమ్మన్యుఁడా సమాధానముచెప్పు నీప్రమాణాదిసాధకాణాదుఁడా యేదీ నీపదార్థతత్వ జ్ఞానవైభవము? ప్రమాణప్రమేయాది షోడశపదార్థములనుగాని ద్రవ్యగుణాదిసప్తపదార్థములనుగాని ప్రతిపాదించు నీస్మృతి యాయా పదాంతర్భూతమా? లేక తత్తత్పదార్థముల నిరూపించు వేఱు పదార్థమా? నీస్మృతి నీకంటె భిన్నమా యభిన్నమా? నేను నాస్మృతి యనుచున్నావే నీస్మృతి మట్టమైన నీమూర్ఛావస్థయందు నీకు స్మృతిలేనట్లు చెప్పుచున్నావే? నీసుషుప్తియెడ నీకు స్మృతి లేనిచో నీజాగ్రదవస్థలో నీమూర్ఛావస్థానుభవ మెట్లు వెల్లడింపఁ

గలిగితివి? స్మృత్యవచ్ఛేదకావచ్ఛిన్నమగు నీమ_ర్త్యబుద్ధి యనిత్య గుణవిశేషముగా నిర్ణయించిన నీవు సర్వగ్రాహకమయినగుణమునే ముందుంచక ద్రవ్యమును గణింపనేల? స్మృతిని గడింపక విస్మృతిని గడించునట్లు విస్మృతిని మఱియు స్మృతిని భావాభావములను గణించుటకు స్మృతియే కారణమనునపుడు స్మృతికన్న వేఱుపదార్థమే లేదని యేల నిర్దేశింపరాదు? ప్రమితి యిట్టిదనికాని ప్రమాణ మిట్టిదనికాని ప్రమేయ మిట్టిదనికాని నిర్ణయించుటకై "ప్రమితి విషయాః పదార్థాః" అనుచుంటివికదా? ప్రమితికూడ పదార్థమే కదా? పదార్థవిషయా? పదార్థా యని యనునపుడు "విషయ విషయిణోరభేదః" యని నీ వంగీకరింపకతప్పదుకదా? "గుణగుణినో రభేదః— విషయవిషయిణోరభేదః" అనునట్లు "గ్రాహ్యగ్రాహకయో రభేదః, దృగ్దృశ్యయోరభేదః జడచైతన్యయోరభేదః" అని నీ వొప్పుకొనకీ అనవు డీపిష్టపేషణబహుసంఖ్యాకపదార్థకథన మేల? వెఱ్ఱికి వేవిధాలన్నట్లు నీయిష్టమువచ్చినట్లు నీవు పదార్థతత్వము నిర్దే శించునపుడు నాయిష్టమువచ్చినట్లు నిన్ను నే నోయీ వేదముల యపౌరుషేయతను నమ్మని కుతార్కికశిరోమణీ నిన్నుఁగూర్చి నీవు నిర్దేశించి చెప్పఁగలవా? పృథివ్యాది నవద్రవ్యములలో నీ వేద్రవ్య మువో పృథివ్యప్తేజోవాయుపరమాణువు లెన్నెన్ని యెట్లెట్లు చేరినవో మఱి యవి యాకాశకాలదిగాత్మమనస్సులతో నెట్లుకూడినవో యింతేల జననమరణస్థితులయందలి నీయనుభవమేమో యనుమాన ప్రమాణమున సాధించి నిర్దేశింపఁగలవో—నీవు తల్లిగర్భములో నున్నపుడు నీవు సస్మృతుఁడవా లేక విస్మృతుఁడవా— సస్మృతుఁడ వైనచో నీతల్లిగర్భమున బోరగలనుంటివా లేక వెల్లకిలనుంటివా? చెప్పుము. చెప్పలేక విస్మృతుఁడవంటివా శరీరము నీతల్లిగర్భమున మొలచినట్లు నీ వెట్లు చెప్పఁగలవు? యెద్దియో నీకుఁదోఁచిన

ట్లెల్లఁ బదార్థగణనముచేసి న్యాయవైశేషిక సూత్రభాష్యముల తాత్పర్య మిద్దియని నీవు గ్రహించినట్లె యాదేవభాష కర్థమను కొని గౌతమకణాదమునుల తాత్పర్యమిదియేయని పామరుల యొద్దఁ బండితుఁడ ననిపించుకొని డాబుకొట్టెదు "పశ్యన్నపిచ నపశ్యతి మూఢః ఉదరనిమిత్తం బహుకృతవేషః" అన్నట్లు కేవల లోకోపకారకకర్మాచరణమునే బోధించు గౌతమకణాదమునిమతము లకు బ్రహ్మను బోధించుట వేదభాషవలె శ్రీవేంకటేశుని బోధించుట రాతిబొమ్మవలెఁ గల్పింపఁబడిన సూత్రములకుం దద్భాష్యములకుం దెలిసీతెలియని సంసారాంధకార నిమగ్నులై జీవనసుఖేచ్ఛచేతఁ గూటికి దేవులాడు పండితమ్మన్యు లజ్ఞానలనకపాయితాసందర్భ ప్రలాపాకర్ణనమున విజ్ఞానులమనుకొని క్రొత్తవింతసాధ్యతావచ్ఛేదకా వచ్ఛిన్నపదార్థతత్వతాత్వతాత్వతత్వతాపార్థకానర్థ వ్యర్థాడంబర మేల? విభజింపఁబడనిపరమాణు వతీంద్రియమని యింద్రియసాహాయ్య మున వచించునీతెలివి తేట లటుండనీ ?

నీవు రావోయీ వైయాకరణసుఖసూచీ- వాక్కుముందా లే కర్థముముందా? నీలోనితలంపు ననుసరించినపల్కు లనుచున్నావా? లేక నోటికివచ్చినట్లెల్ల వాగుచున్నావా- ఇద్ది సాధు విద్ది యసాధు వని శబ్దముయొక్క సాధుత్వాసాధుత్వకల్పనాక్లేశము వ్యర్థముగా నెందుక ట్లద్దమునఁ దననీడ చూచుకొన్నపిచ్చుకవలెఁ బొందెదవు "అథశబ్దానుశాసనమ్" అపౌరుషేయ వేదశబ్దములనుగూర్చియా నీయనుశాసనము లేక లౌకికమర్త్యవైఖరిన్గూర్చియా ? మనుష్యుల కంఠములనుండి వెలువడినవైఖరి యనుశబ్దవిశేష మలౌకికాపౌరుషేయ వేదశబ్ద మెంతమాత్రము న్గానేరదుకదా ? మఱియును శ్రవణమాత్ర గ్రాహ్యమగు శబ్దవిశేషమును చక్షుర్గ్రాహ్యమగునా ? అ-ఇ-ఉణ్వా ద్యక్షరసంజ్ఞారూపమగు వ్రాఁతంబట్టి యెట్లు నిర్దేశింపఁగలవు ?

"ఆత్మావివక్షమాణోయం మనః ప్రేరయతే మనః మనఃకాయాగ్ని సంయోగాత్ప్రేరయతి మారుతమ్" చైతన్యం సర్వభూతానాం నిర్వృతిర్జగదాత్మనాం నాదబ్రహ్మముపాస్మహే" అని నిర్గుణము శబ్దబ్రహ్మమనుచు మఱి యాత్మకుం బరాపశ్యన్తీ మధ్యమా వైఖరీ రూపములం బరమాత్మయొక్క పలుకు నిచ్చు పాంచభౌతికోపాధి వలన శ్రవణగ్రాహ్యమయినదని చెప్పెదవే? నిర్గుణమగు ఆత్మకెందు కూరక వివక్షాకల్పనము కుందేటికొమ్మువలెం జేసెదవు? నాదమే బ్రహ్మమనుచు రజ్జువునందలి సర్పమువలె నాదబ్రహ్మమందీజగమంతయు నధ్యస్థమారోపితవివర్తమని యొప్పుకొను నీమతమున నాదవివర్తము వివృతస్వరూపము రజ్జువివృతసర్పమువలె భ్రాంతికల్పిత మిథ్యాభూతావాస్తవమగు నకారాద్యాత్మకవాగర్థసాధుత్వానిరూపణమేల? మనస్సులోం బాలుత్రాగినట్లు- అపౌరుషేయవేద మతీంద్రియముకదా? యనిత్యలౌకికశ్రవణమున కగ్రాహ్యముకదా? యావేద శబ్దము నీ వెట్లు వినంగల్గితివి? నీకంటికిమాత్రమే గోచరమగు నచ్చుల యొక్కయు హల్లులయొక్కయు నాకృతివిశేషములగు ప్రాకృతజన కల్పితసంజ్ఞామయాక్షరపద వాక్యసమూహములే యాయతీంద్రియ లౌకికాపౌరుషేయనిత్యవేదశబ్దములని నీవు చెప్పుట పెట్టనిబచ్చలి లేనిగేదె పోట్లాటవలె హాస్యాస్పదముకదా? కాంబట్టి నీవు వేదశబ్దముల సాధుతాసాధుతలనుగూర్చి యుద్దేశించిన శబ్దానుశాసనప్రకటనము పిచ్చిపని- మనుష్యవాక్కు లెట్లుండవలయునో తెలుప నీశబ్దానుశాసనము పనికివచ్చునేమోయని యనుకొంటివేని-నానాల్కనాపల్వారుస మొదలగు నవయవశక్తిననుసరించియు నాకంఠనాళ పటిమననుసరించియును నాతక్కినశరీరావయవస్థితి విశేషములననుసరించియును నాతలంపులను వాచికాద్యభినయవిశేషము లుండును- మధ్యనో లక్ష్మీపతియొప్పడన్నట్లు నీశబ్దానుశాసన మెందుకు మొండి

చేతివాని కంగుళివిన్యాసవిశేష మెట్లేగించినట్లు? తమతమయవయవ శక్తికొలఁది జంగమస్థావరాత్మకప్రాణివిశేషములన్నియుం దమకష్ట సుఖములఁగూర్చి నామరూపాత్మకముగా సహజము వెల్లడించుకొను చున్నవి- మఱియును గ్రహణసామర్థ్యమున ననుసరించి యావాచికాంగ హార్యసాత్వికాభినయవిశేషాత్మకనామరూపభేదముల నాయాజంగ మస్థావరజీవులు తెలిసికొనుచున్నవి- నాయూహా యెట్లభినయించినపు డెట్టిజీవు లెట్లు తెలిసికొనఁగలరో యట్టియభినయప్రయత్నము నా కెఱుకగాని నడుమ నీశబ్దానుశాసనమెందుకు? నాయూపిరిదీసికొనుట నీవు మప్పవలెనా? నీ కూపిరితీసిగొనుట యెవరు మప్పినారోయి మధ్రుముఁడా? ఏమి నీయచ్చులు హల్లులు నీసంజ్ఞలు నీగ్రంథములు నీగడబిడలు నీశబ్దానుశాసనము నీయింట్లోనివారికా? నీయిరుగుపొరు గులకా? లేక దేశమందలి జనులకా? ఒక్క-సంస్కృతసంజ్ఞిక భాషకా? లేక లోకములోని యన్నిభాషలకా? తలంపులును మఱి యాతలంపులఁ దెలుపనుంకించు చతుర్విధాభినయములును జిహ్వా దాక రుచి పుట్టె దాక గుణ మన్న ట్లెందఱు మనుష్యులున్నారో యన్నివిధములు అభినయవిశేషములు సహజజన్యములు కాని శిక్షా కృతము లెంతమాత్రము న్గానేరవు- మఱియును దత్తత్సమయాను కూలముగాఁ బ్రసంగముననుసరించి యభినయవిశేషము లుపయో గించుచుండును- కాఁబట్టి నీశబ్దానుశాసనభస్మహోమ మరణ్యరోదన మోటయా శాబ్దికమ్మన్యుఁడా-యేదీ నీతెల్విరమధాతువుకంటె ఘుజ్ం తము చేసినప్పుడు రామయని యయినదా దానికి సు చేర్చిన రామసు అని పల్కి- పిదప రుత్వము వచ్చి రామరయి యారు విసర్గగా మాఱి "రామః" యని ప్రథమైకవచనరూపమైనదా? సరేకాని రము అను రెండక్షరములుగలశబ్దమే ప్రాతిపదికమా? లేక యా రాకు మాకుఁ గూడఁ బ్రత్యేకప్రాతిపదికము లున్నవా? అర్థపదధాతుప్రత్యయం

ప్రాతిపదికమ్ యథాగ్నిరితీత్యక్షరరూపమ్'' అట్టిప్రాతిపదికప్రకటనము వలన వక్తకు శ్రోతకునుఁగూడఁ బోధముప్రయోజన మర్థ మనఁ బడును– అట్టిప్రాతిపదికము స్వయంభువు న్గారణముకావలెను గాని కార్యరూపముగనుండకుంటయు ధాతువనుటకుఁ బ్రయోజనము మఱియు నాప్రాతిపదికము సుప్తిఙాన్తప్రత్యయములలోఁ జేరఁగూడదు. కాఁబట్టి యట్టిప్రాతిపదికరూపమే మోక్షసూచీ నీవెట్టియూహచేఁ గల్పింపఁబడవలసినదేకాని యున్మత్తమనోవికారమువలెకాక శబ్దమకారణము స్వయంవ్యక్తమని చెప్పునీతెల్వితేటలు చాలు నీ ప్రకృతిప్రత్యయకల్పన మదొక వెఱ్ఱి– లోకములో నానావిధవక్తలు తమయొక్క నానావిధోహలను నానాప్రకారాభినయములతోఁ దెల్ప నుంకించుచున్నారు. మఱియును శ్రోతలు తమతమ శక్తికొలఁది గ్రహించుచున్నారు. ''చత్వారి శృంగాస్త్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాఅస్య త్రిధాబద్ధో వృషభోరో రవీతి మహాదేవోమర్త్యా ఆవివేశ''సహజశబ్దబ్రహ్మమునకుగగనసాధమునకువలె వన్నెలు చిన్నె లేర్పర్చు నీపిచ్చి కట్టిపెట్టుము. ఆర్య ప్రాణ మానార్యప్రాణమును భేదముగడించునట్లు శబ్దమునకు సాధుత్వాసాధుత్వము లేర్పర్చు నీతెల్వి చాలును– ప్రతిజంతువునకు న్దనయూహ లెట్లు వెల్లడించవలెనో యట్టినేర్పు సహజసిద్ధమే? నడుమ నీశబ్దానుశాసనమెందుకుఁ బిలువనిపేరంటకము చెప్పుచుందువలెను? నీకష్టసుఖములు నీవు వెల్లడించుకొనువిధమే శబ్దానుశాసన మెఱిఁగి చేయుచున్నావో? అకారాదిస్వరములెవ్వియో కకారాదివ్యంజనము లెవ్వియో యేస్వరవ్యంజనములకూడిక న్దొల్లి సకలజనవిదితముగా నీ వేర్పర్చుకొన్నపద్ధతి ననుసరించి నీయాకస్మికకష్టసుఖదశలఁబల్కఁ గలవో యట్టినామరూపము లేర్పర్చఁగలవా? ''అథ శబ్దానుశాసనమ్'' అనుటలో ''అథ'' యను శబ్దమునకు వేదమునకు శబ్దానుశాసన

మొనర్చెద ననియా ? లేక లౌకికభాష కనియా ? అపౌరుషేయము నిత్యమునై బ్రహ్మమువలె నతీంద్రియపదార్థమగు వేదమునకు నీశబ్దానుశాసనశాస్త్రముప్రవర్తిల్లనేరదుకదా? మాయవలె జగత్తువలె ననంతవిధమయి క్షణికమై స్వభావముగాఁ బ్రవర్తిలుచున్న లౌకికశబ్దమునకు నీశబ్దానుశాసనము గ్రుడ్డికి కాటుకవలె హాస్యాస్పదమగును. అపశబ్దము సుశబ్దమును సంస్కృతి మపభ్రంశమనియును నీయూహాలో నున్నవిగాని వాస్తవము లోకములో లేనేలేవు-నీయపశబ్దము నాసుశబ్దము- నీసంస్కృతము నాయపభ్రంశము- సహజము నవ్యాకృతశబ్దబ్రహ్మము నానావిధముగా నానావిధదేశజనులందు వ్యాకృతమై తత్తద్దేశమున గ్రాహ్యమై యనాదిగా నున్నయనియే కాఁబట్టి నీ "అధ" శబ్దమును నీశబ్దానుశాసనమును స్వప్నపులకితములు భ్రాంతిమూలములు- జనులందఱు తనయూహాల నైలుపుకొనునామరూపములన్నియు సంస్కృతములును వ్యాకృతములే- సంస్కృతమును వ్యాకృతమును మొదటఁగాకున్నచో నామరూపప్రకటనమే కానేరదు- ఇంతకును నామరూపములయర్థమును భావమును రసమును జనులకందఱి కాత్మైకవేద్యముగాని యిదమిద్ధమ్మని తెలుప నశక్యము- పంచదార యనువస్తువుయొక్కగుణ మిట్టిదని యనుభవైకవేద్యమే కాని యథార్థముగాఁ దెల్ప నశక్యము- నీయాఁకలి యెంతో నీడప్పి యెట్టిదో నీకష్టసుఖములెట్టివో నీకే స్ఫుటముగాఁ దెలియవపుడు పరుల కెట్లు తెలుపఁగలవు ? ఆకాశ మిట్టిదని బ్రహ్మ యిట్టిదని గాని నిన్ను నీవు చూపించుట గాని యెట్లసాధ్యమో శబ్దతత్త్వము తెల్పునీశబ్దానుశాసనప్రయత్నఫలమ ట్లసాధ్యమును మఱియు నసంభవమును.

నీవు రావోయీ మీమాంసదుర్దురూఢుఁడా- కణాదగౌతమమునులయభిప్రాయము ద్రవ్యప్రమాణాదిపదార్థతత్త్వమును గ్రహించి

జగదుపకారకమగు ధర్మప్రవర్తనమునఁ బ్రతుకు గడపుకొన్న యెడలఁ గైవల్యస్వరూపమగు మనస్సంతుష్టి కలుగుననియును "రక్షోహాలఘ్వసందేహాః ప్రయోజనమ్" అని సకలజంతుప్రాణసంరక్షణబుద్ధిప్రయుక్తమై విస్పష్టమైన మితవాక్కు పలుకవలయునని పతంజలిమునియొక్క ముఖ్యతాత్పర్యమనియును న్యాయవైశేషికమతావలంబులను శాబ్దికు నొప్పించి పంపినాఁడ నీవు రమ్ము "చోదనాలక్షణధర్మో వేదః" అనునపుడు ధర్మస్వరూపమగు వేదము చోదనాలక్షణము చోదన మనఁగా నపూర్వఫలమునిచ్చు నగ్నిష్టోమాదిక్రతువిధానము పశువపాహోమాదికమని యర్థము చెప్పెదవా? ప్రాణిహింసను జెప్పున దెంతమాత్రమును బ్రమాణము గానేరదు. మఱి యలౌకిక మపౌరుషేయమగు మంత్రబ్రాహ్మణాత్మకమగు వేద మెంతమాత్రమును లౌకిక కామ్యకర్మపరము కాదని తలంప వేల ? పురుషవేద్యముగాని పురుషప్రయత్నసాధ్యముగాని యనిత్యమర్త్యైహలౌకికమగు పౌరుషమే యగునుగాని యపౌరుషము పారలౌకిక మెట్లగును ? కాఁబట్టి వేదము తప్పక పౌరుషేయమే యని యనకతీఱదు– మఱియును దర్పణములవలె మునిదృష్టమును గృతమని తప్ప కెఱుంగవలయును– కాఁబట్టి సకలభూతదయాపరులును సకలభూతసములు నతీంద్రియద్రష్టలగు మునులు కేవల పారలౌకికపదార్థవిజ్ఞానదాయకమగు శబ్దజాలమునే చోదనాలక్షణధర్మమగు వేద మని ప్రతిపాదించిరి కాని పదార్థములను నాటకమునందువలె శృంగారవీరకరుణహాస్యభీభత్సభయానకరౌద్రాద్భుతము లనునెన్మిదిరసములచే జనులకు వేధపుట్టించుటకుగాదు. కేవలాధ్యయనమునకుమాత్రమే మంత్రబ్రాహ్మణశబ్దజాలప్రయోజనము– వేదపఠన మలౌకికమగు చిత్తశాంతిని గలిగించి పారలౌకికమగు శాంతరసమునుగలిగించి కైవల్యప్రాయమగు నిత్యమనఃసంతుష్టిం గలిగించును– అన్నమునకు రుచికలిగించు మధురామ్లతిక్తలవణకటుకషాయ

రసమువలె శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషకల్పనిరుక్తములు గౌణము లుగాఁగల్పింపఁబడెను. కాని యీయాఱువేదాంగములు వేదాధ్యయనమువలె పారలౌకికధర్మమగు చిత్తశాంతికి ముఖ్యములుకావు. షడంగములచే వేదమున కపార్థములుకల్పించి వేదశబ్దములు క్రతువిధానపరములని లేనిపోనియూహలతోఁ జిత్తశాంతి నాపుచేయు పశువపాహోమాదిలౌకికక్రియాకలాపములఁ బన్ను నీవైదికమ్మన్యత నేమనవలయును? బుద్ధిజాడ్యజనితోన్మాదమఁడా శ్రోత్రియుఁడా- నీముఖ్యప్రమాణము శబ్దమేకదా? శబ్ద మనఁగా నాప్తవాక్యముకదా? ముఖ్యాప్తవాక్యాత్మకమగు వేదము సకలప్రాణిలోపకముగాని ప్రాణిహింసకమగునా? యీరహస్య మేల గుర్తెఱుఁగక వేంకటేశ్వరుఁడు మనుష్యరూపముననున్నాఁడని నమ్మి మనుష్యునిపోల్కి రాతివిగ్రహమును జేసి యామొగమునకు నామములుపెట్టి మ్రొక్కి దేవునివాస్తవతత్వమెఱుంగని పామరునివలె దేవతలన నెట్టివారో సవిగ్రహులో లేక విగ్రహులో తర్కింపక నీవలె నాఁకలినిద్రలును గామక్రోధలోభమోహమదమత్సరములను వారికిఁ గల్పించి గ్రామదేవతపండుగనడుపుజానపదులవలె నేమేమో తెలిసీతెలియని మంత్రము లుచ్చరించు నధ్వర్యుసప్తదశకసహాయముఁ దక్కినమనుష్యులకన్న నీపవిత్రత నగపర్చు దంభకర్మముల విజ్జృంభిగుచు మేఁకలు మొదలగు నిరపరాధజంతువులను గటికవలె నేల చంపెదవు? ఏదీ నీశ్రోత్రియకర్మమహిమము మృతకళేబరము నొకదానినైన సచేతనముగా నొనర్చఁగలవా? క్షణములోఁ బ్రాణముతీయవచ్చునుగాని ప్రాణము పోయుట నీయబ్బకైనఁ దరమా? నీషడంగవిధానములన్నియును గేవలము స్వలాభపరులచేఁ గల్పింపఁబడిన దంభక్రియలని తెలిసికొమ్ము- సకలజంతుప్రాణసంరక్షకములు కాని కర్మములన్నిటికిని స్వార్థపరతయును గేవలస్వోదరపోషణాసక్తియు నని తలంపవేల

నోకూళసోమాసీ? నీబ్రతుకును నీదారపుత్రులబ్రతుకు నీకెంతతీపియో కనికర మావేఁకలబ్రతుకు వాని కంత తీపి యని తలంపవేల నోబుద్ధిహీనుఁడా చాలుచాలు నోశ్రోత్రియాతతాయీ! నిన్ను దన్ని దగిలి వేయవలయు నిద్దియే నీకుఁ దగినమర్యాద- చీచీ జీవఘాతకుఁడా! సహనము న్భూతదయయును ముఖ్యబ్రాహ్మణధర్మములు నీయధ్వర్య సప్తదశకధూర్తలక్షణమెఱుఁగలేని పామరుఁడవు నిన్నదుణింపకతీఱదు. సముద్రఘోషవలె మేఘగర్జితమువలె నన్యోన్యాకృష్టఖగోళపరస్పర సంఘర్షణధ్వని నతీంద్రియద్రష్టలగు మునులు లోకోపకారమునకై సుప్తిగంతములు గావ్యాకృతములు నొనర్చి పఠనమాత్రమునఁ జిత్తశాంతిన్గలిగించి సంసారక్లేశమును మఱపించు మహిమముఁగల మంత్రబ్రాహ్మణరూపముగాఁ గావించిరని తెలియుము. వేదములు పఠనమాత్రప్రయోజకములు చిత్తశాంతికరమహిమాస్పదములుగాని కర్మపరములుకావని తెలిసికొనుము- జైమినియభిప్రాయ మిద్దియేయని గ్రహించుము. శివనారాయణాది నామోచ్చారణ మెట్లు కైవల్యదాయకమని పురాణమతమో యట్లే మంత్రబ్రాహ్మణాత్మక వేదాధ్యయనము సంసారక్లేశహారకమని జైమిని యభిప్రాయము.

వాదించెదవా చెప్పుము- "ఇషే త్వోర్జేత్వేత్యాహ ఇష మేవోర్జం యజమానాయ దదాతి" ఇషేత్వేతి పలాశశాఖాంఛినత్తి" పలాశశాఖకు మోదుగుకొమ్మ యని యెట్లెఱిఁగితివి? గౌతమవ్యాసమును లిరువురు మాత్రమే యాప్తు లనఁదగినవారుకదా దక్షిణకై నీ కుపదేశించు నీప్రాకృతులు చెప్పినయర్థము పలాశ మన మోదుగుచెట్టని మాత్ర మెట్లు నమ్మెదవు? "పలాశశాఖాంఛినత్తి" అనఁగా నాఁకలిగొన్న తోడిపాటివారియాఁకలిఁ దీర్చుటకై పలాశమన నన్నముతోనిండినకుండ- శాఖ మనఁగా కుండలోనియన్నమందలి యొక పెద్దకబళ మని నే నర్థము చెప్పుచున్నాను. "ధాతూనా

మనేకార్థత్వాదవ్యయానా మనేకార్థత్వా న్నిపాతానామనే కార్థత్వా దుపసర్గాణా మనేకార్థత్వా త్ప్రసంగవశా త్సర్వశబ్దానామప్యభీష్టార్థ త్వాత్'' అనుటచే శబ్దమున కర్థము సమయోచితముగాఁ దీసికొనుట సార్వలౌకికమేకదా ? కేవల ధ్వన్యాత్మకమగు శబ్దమును వర్ణాత్మక ముగా వ్యవహారమునకై క్షణములు గడియలు మాసములు సంవత్స రములు శతాబ్దములవలెను దిక్కునుగూర్చి క్రిందుమీఁదు ప్రక్క తూర్పు పడమర దక్షిణోత్తరములు వంక తిన్నదనముల మూలలు చేరువ్వు దూరములు క్రోసులు యోజనములవలెను మఱియొకటిరెండు మొదలగుసంఖ్యలు కొలతలు తూనికలు పొడువు పొట్టి మొదలగు పరి మాణవిశేషములు బ్రాహ్మణాదివర్ణములు నామభేదములవలెను కల్పితములుగాని వాస్తవములు కావు. మఱియును గటకాద్యలంకారా కృతివిశేషములు కృత్రిమములనిత్యకార్యములుగాని బంగరుమాత్రమే వాస్తవమైనట్లు స్వరములు వ్యంజనము లచ్చు లల్లులు పదములు వాక్యములు ఉదాత్తానుదాత్తాద్యాత్మక సప్తస్వరవిశేషము లివన్ని యును వ్యావహారికసత్యములుగాని నిక్కముగాఁ బారమార్థికసత్య ములు కావు. ఈశబ్దమున కీయర్థ మని నియమములేదు. యుగాను సారముగా వేదములు వేదార్థములు మాఱుచున్నవనుపురాణవచ నము పాటించక తీఱదు. అనాదిగా పఠనపాఠనసంప్రదాయక్రమ మున నిన్నియక్షరము లిన్నిపదము లని ప్రత్యేకవేదమునకు నియమిత ములై యున్నవికాని- వేదముల కర్థమును వివరించు నిరుక్తమను వేదాంగమునకుఁగాని- విద్యారణ్యభాష్యమునకుఁగాని యాధునికము లగుటచేత నట్లు గ్రంథసంఖ్య నియమింపఁబడియుండలేదు. మఱియును దేహములవలెనే వేదాంగములు ప్రాచీనములు కావు. కావుననే వ్యాకరణమున వేదమునకు చ్ఛందస్సనియును వేదాంగపురాణాదు లార్షములనియును తక్కినకావ్యములకు భాషయనియును బ్రతిపాదింపఁ

బడెను. మఱియును మతభేదములని "అశ్వాలంభంగవాలభం సన్యాసంపలపైతృక దేవరేణసుతోత్పత్తిః కలౌపంచవివర్జయేత్, సన్యసేత్సర్వకర్మాణి వేదమేకం నసన్యసేత్" అనియును కొందఱుశ్రౌత కర్మములందు పిష్టపశువును మనుధర్మశాస్త్రమున శ్రౌతస్మార్త కర్మలం దేవానియమంబైనను బశుహింస సేయఁగూడదని యుగాను సారముగా శ్రౌతస్మార్తకర్మములు మార్చుకొనవలయుననియును బశుహింసచేయుకర్మము కామ్యకర్మము ననిత్యమును గౌణముఁగాని ముఖ్యముకాదనియును వక్కాణింపఁబడెను. కాఁబట్టి యిన్నింటెంబట్టి చూడఁగా వేదముల కర్థము వేదములకేమి మతేశబ్దమునకైననుసమ యానుసారముగా యథేష్టముగాఁ జెప్పవచ్చునని తేలినఫలితార్థము—"ఏకశబ్దః సుష్ఠు సంప్రయుక్తః" అనుటచే లౌకికశబ్దము యథేష్టముగా ప్రయోగింపవచ్చునుగాని వేదశబ్దముమాత్రము తన్నియత స్వరముననే యుచ్చరింపవలయునని నియమము. మేఘగర్జితమువలె సముద్రఘోషవలె మంత్రబ్రాహ్మణాత్మకమగు వేద మొకయను కరణశబ్దముగాని యొకయర్థమునుగాని కర్మమునుగాని యుద్దేశింపదు. అనాదిగాఁ బఠనపాఠనసంప్రదాయక్రమమున నియతసంఖ్యాకగ్రంథ మగుటచే వేదము శివనారాయణాదిశబ్దములవలె నుచ్చరించినమాత్ర మున బ్రహ్మానందదాయకమని సిద్ధాంతీకరింపఁబడెను. అర్థవివక్షచేసి నచో నశ్వమేధమున "నమాంయభతికశ్చన" అను మొదలగు మంత్రములకువలె నర్థము చెప్పుట యెంతయశ్లీల మెంతజుగుప్సాకరము వేదములు కేవలముం బఠనపాఠనప్రయోజకము లేగాని కర్మపరము? లెంతమాత్రమును గావని యెఱుఁగు మోమోటుశ్రోత్రియుఁడా! నీవలెఁ గరచరణాద్యవయవముల దేవతలు తిండికై దేవులాడుచుఁ దమకు నగ్నిముఖమున హవ్యమున లంచమిచ్చువారికి రంభాభోగాది స్వర్గసుఖము నలిగింతురనుకొంట వట్టిభ్రాంతి— పరోపకారముగా నీవు

ప్రవర్తించినయెడల నీబ్రతుకు హాయిగా జరుగును- లోకులయెడల నీవెట్లు నడిచెదవో తలుచు లోకులుకూడ నీయెడల నట్లే నడిచెదరు. కాఁబట్టి సకలజనరంజకమయిన నీపలుకే సుశబ్దము జనుల కసహ్యమగు నీపలుకే యపశబ్దము. జనరంజకముగా నీవుచ్చరించినశబ్దమే వేదము- జనరంజకమగు నీప్రవర్తనమే యజ్ఞము- తిల కాష్టమహిషబంధప్రాయమగు వేదముజోలి నీకేల? ప్రతిదినమును నీతో వ్యవహరించు నీతోడిపాటిజనుల యనురాగమును సంపాదించుకొని నీబ్రతుకు సుఖముగాఁ గడముట్టించుకొనుము- సకలభూత దయాపరుఁడవైన నీకు దైవకృత్యములన్నియు నుపకారములుగాఁ దోఁచకమానవు.

ఋగ్వేదమునందలి పదములు ఉదత్తానుదాత్తస్వరితాక్షరములు ప్రత్యేకము "సతోబంధుమసతి నిరవిందన్ హృదిప్రతీష్యాకవయోమనీషా" అను ఋగ్వేదశ్రుతికి సత్యమగుబ్రహ్మపదార్థమున కసత్యమగు జగత్తునకును సంబంధమును మునులు తమహృదయమందు తమయోగమహిమముచేఁ గనిపెట్టిరని కదా యర్థము? వేదశబ్దములు లౌకికభాషాశబ్దములవలెఁ జూపట్టినట్లు మునులచేఁ బ్రకృతిప్రత్యయ భాగవిశేషములవలనఁ దోఁచుచున్నవికాని వాస్తవముగా మేఁకకుఁ బొడఁగుననున్న స్తనమునకు మెడనున్న స్తనమునకు వలె లేడిమూతికెగుఁనున్న కందోయికి మఱి యామీఁదనున్న కందోయికివలె నాకృతిమాత్ర పోలికఁగలదుగాని యర్థమున కెంత మాత్రమును బోల్కి లేదు. మఱియును వేదము జ్ఞానపరముగాని కర్మపర మొకింతయును గాదు. వేదము కేవలమును బఠనపాఠనములఁగూర్చియే యుద్దేశింపఁబడెను. పరమాత్మను మునులు తమ హృదయములందు కనిపెట్టి కైవల్యానందమును బొందిరికాని శ్రౌత స్మార్తదంభక్రియాకలాపము చేతఁ గాదు- గ్రహగతులుమార్చుటకుఁ

గాని ఋతువులనుదాత్మాజ్ఞానర్చుటకుగాని పంచభూతములను యథే ష్టానుసారముగా నడిపించుటకుఁగాని వేయేల కోరినట్లు కలలుగాంచుటకుఁగాని మఱేలౌకికక్రియ లభీష్టానుసారముగాఁ జేయుటకుఁగాని యీశ్రౌతస్మార్తకర్మములు పనికిరాకున్నవి. సర్వక్రియలు విధివశములుగాని పౌరుషప్రయత్నసాధ్యములు కాకుంట రూఢికదా ? భూతభవిష్యజ్జన్మములఁగూర్చియు నవశములగు కాలగతులనుగూర్చియును నతీంద్రియములగు స్వర్గపాతాళవస్తువులంగూర్చియును గతజలసేతుబంధనమువలెఁ జింతింపనేల ? "ప్రకృతమనుసరామః పాయసం భక్షయామః" అన్నట్లు మనతోడిపాటిప్రాణులను మచ్చికచేసికొని తదనుగ్రహమును సామదానోపాయములచేతనుమాత్రమే సంపాదించుకొని సర్వజనసమ్మతముగా నడుచుకొని యొరులసుఖపెట్టి తానుసుఖపడుచుఁ దనజీవితమును గడపుకొనుటకన్న నవశ్యకర్తవ్య మర్త్యకర్మ మింకెద్దియుఁగాదని ఘంటాపథముగాఁ జాటెద నోయీ పూర్వమీమాంసకమ్మన్యుఁడా !

"అథాతోధర్మజిజ్ఞాసా" అని ప్రారంభించినావుకదా "బోధనాలక్షణోధర్మః" అనుచున్నావు వేదచోదితకర్మాచరణము ధర్మ మనుచున్నావు కాని వేదశబ్దమున కర్థమేమిచెప్పెదవు ? "విద్యతేఽనేన విత్తమితి వేదః" అని విద్యారణ్యభాష్య మొప్పుకొనెదవా ? లేక వేద మనఁగా నొకవిధమైనయజ్ఞమునకుఁ జేరినపనిముట్టున కర్థము చెప్పెదవా ? లేక "విదృక్ జ్ఞానే" అనుటచేతఁ దెలివి కర్థము చెప్పెదవా ? యెట్లైన నిర్వచించుము వేదశబ్దార్థ మెట్లున్నను నిక్కముగా ధర్మప్రతిపాదకమగుశబ్దము కాకతీఱదుకదా ? ధర్మ మైహలౌకికము పారలౌకిక మని రెండువిధములుగా విభజించి యైహిలౌకికముగాఁ బ్రాకృతులును బారలౌకికముగా మునులును ప్రాకృతులగు మానవులు పరోపకారవర్తనము ధర్మ మనియును మును లాత్మ

జ్ఞానైకప్రయోజనమగు సాధనచతుష్టయ సంపత్తిసంపాదనమే ధర్మమని మునులు సనాదిగా వ్యవహరించుట తెల్లముగదా ? శ్రౌతకర్మమే ధర్మమనియును శ్రౌతకర్మము వేదచోదితమనియును కాఁబట్టి పశుహింసాకరములగు క్రతువిధానమే ధర్మమనియు నుద్ఘోషించుచుఁ బేదసాద లన్నములేక మలమలమాడుచుండఁగా వారికి సాయపడక నిష్ప్రయోజనభస్మహోమ మేల చేసెదవు ? పాలు నేయి ధాన్యములు వ్యర్థముగా నగ్నిపా లేల చేసెదవు ? ప్రాణభీతిచే మొఱవెట్టుపసుల నేల చంపెదవు ? ఆకాశమువలె శబ్దమాత్రగుణముగల వేదపురుషుఁడు ప్రత్యక్షముగాఁ గ్రతువులోనచ్చి మని నిన్ను బలిమిచేయలేదే ? తమ్ము హింసించుమని పసులు నిన్ను బతిమాలినవా ? లోకులను భీషించి యర్థికులను దండి వారికి లేనిపోనిగగనారవిందోపన్యాసములిచ్చి దక్షిణ నార్జించి పొట్టపోషించుకొను ధూర్తుల నధ్వర్యులంగావించుకొని పగటివేషగానివలె నేమి నీపాండిత్య మోహో యేమి నీవేషముల మాకార్పి యేమి నీదివ్యమ్మన్యత?చాలుచాలునీచిందులు నీపరవళ్ళు నీలేఁతలోళ్ళు నీగడ్డముల నూళ్ళు నీచప్పిళ్ళు నీపెడబొబ్బలు నీకన్నుమిటకరింపులు బొమ్మలాటవానివలె నటునివిధమునఁ బామరులను మోసపుచ్చెదవా ? నటులు నీకంటె మంచివారు. తమవిద్యావైభవమునుమాత్ర మగపచ్చి సకలప్రాణులను రంజింపఁజేసి తమపొట్టపోషించుకొనుచున్నారు- నీలో నీకే కాదు నీయబ్బకుఁగూడ స్వప్నమందైనఁ బొడగట్టని మిత్రావరుణులనియు నగ్నిష్టోములనియు నేమేమో దిక్కుమాలిన లేనిపోనిపేర్లతోఁ బిశాచగ్రస్తునివలె నున్మత్తునిమాడ్కిఁ బ్రలపించుచుఁ బైపెచ్చు నిరపరాధిజంతువుల నేల హింసించెదవు ? మును శ్రీశ్రౌతస్మార్తకర్మములు విధించిరని నమ్మెదవు కాఁబోలును కోళ్ళు గొఱ్ఱెలు బఱ్ఱెలను బసుపుబొట్లతో గుడిలోనున్న గ్రామదేవతకు బలియిచ్చు మాంసాశనులగు క్రూర

పామరజానపదులకంటె నీవు క్రూరుఁడవు మఱియు మూర్ఖుఁడవును. సర్వలోకోపకారపరులును సకలభూతదయామయులును కేవల సమాధి నిష్ఠులు నతీంద్రియద్రష్టలగు మునుల పేరు పెట్టుకొన్న ధూర్తులు క్రూరులు కేవలకుక్షింభరులగు జ్ఞానలవదుర్విదగ్ధు లనాదిగాఁ గ్రతు క్రియాకలాపములను రాక్షసకృత్యములను స్వార్థపరులై పామరుల లోఁగొనుచు నిట్టియనర్థక శ్రౌతస్మార్త క్రియాకలాపములం బ్రకటించు చున్నారుగాని వాస్తవముగా మనుష్యధర్మము సర్వప్రాణ్యుపకారకము లగు సత్యదయలఁ బ్రవర్తించుట తప్ప నితరక్రూరకర్మ మెద్దియు ముమ్మాటికి న్గాదు.

“కోదదర్శప్రథమం జాయమానమస్థన్వంతంయదనస్థాబిభర్తి- భూమ్యాఅసురసృగాత్మా క్వస్విత్కో- విద్వాంసముపగాత్ ప్రష్టుమేతత్” అను ఋగ్వేదానుసారమునా నాత్మ నెవ్వరికి న్వేద్యముకాదు. పరమార్థసత్య మెవ్వరికి న్దెలియఁబడదు- కాఁబట్టి శ్రౌతకర్మములచేత నీవు గగనసౌధనిర్మాణ మొనర్చుట దుర్మార్గమగువెట్టి- అగ్ని సోములు గాని మిత్రావరుణులుగాని నీ కగపడ లేదు- నీహవ్యము మంటఁగలయుటయుం బసులు నీచేఁ జంపఁబడుటయును దప్ప నీకు లౌకికపదార్థ మెద్దియును బ్రత్యక్షానుభూతము కాలేదని నీ వొప్పుకొనకతీరదుకదా? పూర్వులీక్రతువు లాచరించిరి కాఁబట్టి నీవుఁగూడ చేయకతీఱదని యందువా? పూర్వులకును నీకును సంబంధ మెద్దియును లేదు. గత వత్సరమున కిప్పటివత్సరమున కెంతభేదమో నిన్నటియెండకు నేఁటి యెండ కెంతవ్యత్యాసమో నీకును నీపూర్వులకు నంతభేదము. వారు క్రతువు లెట్లాచరించిరో యాశ్రౌతకల్ప మెట్లుండెనో యావేద మంత్రోచ్చారణ మెట్లుండెనో యప్పటి యుద్దిష్ట మెయ్యదియో నీ వెఱుఁగుటెట్లు? నీకుఁ బ్రత్యక్షముగా సంబంధించి నీకుటుంబములోని జనులకందఱికి న్నామరూపములందు మఱి యన్ని విధములచేతను

బరస్పరభేదమున్నదికదా ? కంఠస్వరము రూపము వ్రాఁత యుద్దేశము నడువడి తలంపు మనోవాక్కాయకర్మముల నొకరింబోలి మఱొకరు లే రొకరివలె నొక రాచరింపఁజాల రొకరు తెలిసికొన్న విధము నింకొకరు తెలియనేర రొకరిమత మింకొకరిమతముకా దొకరియిష్ట మింకొకరిదికా దొకరిగతి యింకొకరిదికా దొకరికర్మ మింకొకరిదికా దొకరియదృష్ట మింకొకరికిరాకుంట నీప్రత్యక్షానుభవమేకదా ? వేదము లిట్లు శాసించుచున్నవనియుం బూర్వు లిట్లు నడచిరనియు నీకన్నఁబెద్దలు నాప్తులు చెప్పుచున్నారనికదా నా కులమిది నా వర్ణ మిది నా తల్లి యీమె నా తండ్రి యితఁడు నా సోదరాదిబంధువులు వీరు మఱి యీశబ్దమున కిది యర్థము నేనొనర్చవలసిన శ్రౌతస్మార్తకర్మము లివ్వి యని కేవల శబ్దప్రమాణమాత్రముచేత నేకదా ప్రవర్తిల్లుచున్నావు; నీబ్రతుకుసుఖ మాసించికదా యిన్ని పోకిళ్లు పోవుచున్నావు ? నీవలెఁ గష్టసుఖము లితరుల కుండునని తలంచవా ? నీతోడిపాటివారియెడల నీ వెట్లు నడిచెదవో నీయెడల వారట్లు చేసెదరని నీప్రత్యక్షానుభవము నో యవివేకి వైదికజడుఁడా నమ్మవేల ?

"ఆపోసుమ్యక్షువరుణభియ సంమత్స్రమాల్ప తావోఽనుమా గృభాయ దామేవవత్సాద్విముముగ్ద్వ్యంహోనహిత్వదారేనివిమశ్చనేశ" మెడకిరికిన త్రాఁడును దప్పించి లేఁగను గాపాడునట్లు లోవరుణదేవుఁడా నాపాపములనుండి నన్నుఁ దప్పించుము— నీవనుగ్రహించిన నద్దప్ప నీసాయములేక కనురెప్పలాఁగించుకొనుటకైనను నేను సమర్థుఁడను కానను ఋక్కు నుపేక్షించెదవా ? కన్నెపలుపు మెడనిరికికొని పోవుటచే గిజగిజగింజుకొని బాధపడుచున్న లేఁగ నాయురి తప్పించి సుఖపెట్టు దయాశాలికదా మానవుఁడని యర్థమిచ్చు శ్రుతి పశుహింసను విధించునా ? నీపూర్వులు పశుహింసలొనర్చి క్రతురూప

కామ్యానిత్యకర్మములొనర్చి రని స్వార్థపరులగు ప్రాకృతసంసారుల పల్కులు నమ్మకుము- వేదముల కేయర్థము న్లేనేలే దొకవేళ వేదము లర్థపరములైనచోఁ గేవల దేవతాప్రార్థనచోదకములుగాని క్రత్వాదికామ్యకర్మచోదకములు కానేకావు. "అహరహః సంధ్యా ముపాసీత" అను నిత్యకర్మమునకు వేదము చోదకమని చెప్పకతీఅదు. సంధ్యోపాసన మనఁగా సర్వజగదుపకారముగాఁ దన్ను నడిపించు మనియును మఱేప్రాణికైనఁ దననుండి బాధరానీకుమనియును "ధియోయోనః ప్రచోదయాత్" పరమార్థజ్ఞానముం దనకుఁ గలిగించుమనియును మనుష్యుఁడు దైవమును వేఁడుకొనుటయును సర్వలోకోపకారముగాఁ బ్రవర్తించుటయును- నీపూర్వులవలె నీవు నడువనేవు నీపూర్వు లెట్లునడిచిరో యిప్పటినీయుపదేష్టలుగాని గురువులుగాని యిప్పటిగ్రంథములుగాని నీవుగాని నిర్దేశింప నసాధ్యము. నీ విప్పుడొనర్పు క్రతువు క్రూరకర్మమును వ్యర్థము న్గాని నీపూర్వు లొనర్చినయజ్ఞమువలెనే సత్కర్మము కాదు- నీపూర్వులు వేఱు నీవు వేఱు వారి దొక జాతి నీదొక దిక్కుమాలినజాతి వారి దొక కులము నీ దొక కులము వారిపుట్టుక వేఱు నీపుట్టుక వేఱు నీతల్లెవతో నీతండ్రియెవఁడో నీవు నిశ్చయముగాఁ జెప్పలేవుకదా నీపూర్వు లొనర్చిన శ్రౌతస్మార్తక్రియావిధానము లిట్టివని తెలియ నీకుఁ గాదు నీయబ్బకైన శక్యమా? యూరకపశుహింసకావించి నీకంటెఁ దక్కినవా రధమజాతివా రని నిరసించి నీవు నిలిచినకొమ్మ నీవే నఱకుకొని కోరి యేల ముప్పు తెచ్చుకొనెదవో శ్రోత్రియమ్మన్యుఁడా! యొకటికయాజీ!

"ప్రవృత్తిరేషాభూతానాం నివృత్తిస్తుమహాఫలా" యను మనువచననానుసారముగా నితరులసౌఖ్య మరయక తనయిచ్ఛ కొలంది నిద్రాహారవిహారములం బ్రవర్తించుట సకలజీవులకు స్వాభావ

మేగాని తప్పూకా వయినప్పటికిం బరోపకారమునకై తనభోగములను మానుకొన్నందువలన నిత్యమనస్సంతుష్టి తప్పక కలుగును. ఒకవేళ వేదము స్వర్గాద్యపూర్వభోగఫలక కామ్యకర్మచోదకములయినప్ప టికిం గేవల స్వార్థపరులకే యావేదచోదన ముపకారమగునుగాన నాద్వైతజ్ఞానవతః కర్మాణివిధీయన్తే'' అనునట్లు సర్వభూతసములైన కేవలపరోపకారపరాయణుల కట్టికామ్యకర్మము వేదచోదనాలక్షణ మగు ధర్మ మెట్లగును?

''చత్వారిశృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాఅస్య త్రిధాబద్ధో వృషభోరోరవీతి మహాదేవో మర్త్యాఆవివేశ'' నామాఖ్యాతోపసర్గనిపాతములను నాల్గువిధముల పదజాతులను కొమ్ములు- భూతభవిష్యద్వర్తమానకాలములను మూఁడువిధముల పాదములు- నిత్యానిత్యములు వ్యంగవ్యంజకము నిత్యానిత్యము లను రెండు విధముల శిరస్సులు ప్రథమా ద్వితీయా తృతీయా చతుర్థీపంచమీ షష్ఠీ సప్తము లను నేడు విభక్తులు క్రియాకాచారణముచే నభీష్టఫలప్రద మై జగదాత్మకమై జగత్కారణమై నిత్యమై నిరవయవమైస్ఫోటాఖ్య మైన శబ్దబ్రహ్మము మర్త్యుల నావేశించి యత్యంతము ధ్వనిచేయు చున్నదని పతంజలిమునియును- శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషకల్ప నిరుక్తములు మంత్రబ్రాహ్మణములవలె వేదములును గావు మఱియు ననాది మునికృతములు గావు గాని మశకబౌద్ధాయనాపస్తంబాశ్వ లాయనకాత్యాయనాదినామములుగల ప్రాకృతపండితులచేత గొప్ప గొప్ప ''మశకబౌధాయ నాపస్తంబాది శబ్దాహ్యా దిలకద్రవ్యోప దేశన ఇతి న తేభ్యః ప్రకృతి భూతేభ్యోఽనాదిగ్రంథవిషయసమాఖ్యా వ్యుత్పాదన సభవః'' అని కుమారిలభట్టు వక్కాణించెను. మఱియును ''తత్ర యావ ద్ధర్మమోక్ష సంబంధిత ద్వేదప్రభవమ్- యత్త్వర్థకామ విషయంత ల్లోకవ్యవహారపూర్వక మితి వివేక్తవ్యం- ఏతైవేతిహాస

పురాణ వేదములు బోధించుచున్నవి. ఇతరములగు శ్రౌతస్మార్త రూపములగు లోకవ్యవహారసంబంధముల కర్మములఁ గూర్చి రవంతయు నుద్దేశింపవు. ప్రాకృతాధునిక పండితులయిన మశకబోధాయ నాదిపండితులు లోకవ్యవహారమునను యానుకూలముగా నడుచుటకై శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషకల్పనిరుక్తములను సకలధర్మశాస్త్రేతిహాసపురాణ న్యాయవిస్తర మీమాంస లను దమతమ యిష్టాను సారముగా ధర్మసత్రములు మతములు కోనెలలు మొదలగుప్రజోప కారకములగు శిల్పములను విరచించిరి. కాఁబట్టి మంత్రబ్రాహ్మణాత్మకమగు వేద మొతమాత్రము న్నిత్యనిర్గుణాద్వైతస్వరూపమగు కేవల బ్రహ్మమునుగూర్చి తప్ప నీజగత్సృష్టిస్థితిలయములఁగూర్చి కాని శ్రౌతస్మార్తక్రియలంగూర్చికాని బోధింపదు– ప్రాకృతులు మర్త్యులు నాధునికు లగుమశకాద్యాఖ్యలుగల మనుష్యులచేఁ గల్పితములగు వేదాంగపురాణేతిహాస ధర్మశాస్త్ర న్యాయవిస్తర మీమాంసాది గ్రంథములన్నియును సమయానుకూలములుగా సకలప్రజోప కారములుగా మార్చుకొనవచ్చును– వీని కొక నియమము లేదు. ఏయే దేశమున కెట్లు రంజకములగునో యట్లు చతుర్విధాభినయ మొనర్చుట దేశీసంగీత మగును. ఏనియమమును లేనప్పటికి నెట్లు ప్రజారంజకమై చతుర్విధాభినయము సకలజనాదరణీయమో యట్లే యథేష్టముగాను సకలప్రజోపకారకముగాను సమయానుకూలము గాను శిక్షాదివేదషడంగములను పురాణేతిహాసధర్మశాస్త్రన్యాయ విస్తరమీమాంసలను దోఁచినట్లెల్ల జనరంజకముగా సకలభూతదయ నొకింతయు న్వీడ కప్పటికప్పుడు కల్పించుకొనవచ్చును.

శబ్దానుశాసనమందు పతంజలిముని "చత్వారిశృంగాః" అను శ్రుతికి వర్ణాత్మకశబ్దబ్రహ్మపరముగ నర్థము చెప్పినాఁడుగదా మఱియును హోత యధ్వర్యుఁ డుద్గాత బ్రహ్మ యూనల్గురును నాల్గు

కొమ్ములు ప్రాతఃసవనము మాధ్యందినసవనము సాయంసవన మను మూఁడుపాదములు: పత్నీ యజమాను లనురెండు శిరస్సులు- గాయత్ర్యాదిసప్తచ్ఛందస్సులు నేడుచేతులు- ఋగ్యజుస్సామవేదములచే మూఁడువిధములను బంధింపఁబడి యభీష్టార్థములను వర్షించుచు స్తోత్రశస్త్రాదిశబ్దములను మాటిమాటికి ఘోషించుచు నిట్లు యజ్ఞరూపమైన మహాతేజస్సు మర్త్యుల నావేశించియున్నదని జైమిని మునియును గౌణముగా "చక్రవాకస్తనీ హంసదంతావళీకాశవస్త్రా శైవలకేశినీ"అని నదులను వర్ణించునట్లు కాత్యాయనజైమినులను బండితకవులు వర్ణాత్మకశబ్దబ్రహ్మము నొకఁడు యజ్ఞము నొకఁడు వర్ణించిరి.

మఱి యిప్పుడు స్వరము పదము లయ చేతోవధానము లను నాల్గుకొమ్ములుకలిగి గీత వాద్య నృత్యము లనుమూఁడుపాదములు గలిగి- మార్గ దేశి యను రెండుశిరస్సులుకలిగి- మంద్రమధ్యతార స్థాయిలను మూఁడు తెఱంగుల బంధింపఁబడి సరిగమపదని యనుసప్తస్వరములచేతఁ గోరినట్లు ధర్మార్థకామమోక్షసంపదలను వర్షించుచు రాగరూపకాలప్తులను మాటిమాటికి మొరయుచు నిట్లు కేవల నాదబ్రహ్మముచేతనజంగమస్థావరాత్మ మర్త్యలోకము నావేశించి మ్రోఁగుచున్నదని కాని, బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థసన్న్యాసము లనునాల్గుకొమ్ములుగలిగి జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూఁడుపాదములతో స్త్రీపురుషు లనురెండుశిరస్సులతో రక్తము మాంసము మజ్జవస శుక్రము మేదస్సు నెమ్ము లనునేడుచేతులతో నభీష్టార్థములు వర్షించుచు బాల్య యౌవన వార్ధకములచే బంధింపఁబడి బ్రతుకనుమహాతేజస్సు మర్త్యజీవుల నావేశించి ఘోషించుచున్నదని కాని- సామదానభేదదండోపాయములను నాల్గుకొమ్ములతో- యుద్ధము-కృషి-సేవ లనుమూఁడుపాదములతో చేతనాచేతనరూపము

